అమరజీవి పొట్టిశ్రీరాములు సంచిక




# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మండలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్థాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**విచ్చేనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

## తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పైచేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

## MADHU REFINARY PRIVATE LIMITED
## GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.

Phones : 42729. 42730. 42731, Resi : 42732. Fax : 42730. STD : 08552.

## MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S T D 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5 12 63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు 11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫొటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును "12×10" సైజులో దాత ఫొటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును

రు 116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి

యన్ బి ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

**వైశ్య ప్రబోధిని**

(మాసపత్రిక)

**స్థాపితము**
**1969**



**సంపుటి**
**29**

**సంచిక**
**4**



**డిశంబరు - 1997**



సంపాదకులు :

'గ ~ ద్వారక'

పి.ల. కాంతం శ్రే



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ

"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

# సీతమ్మ ఆస్తులపై అధికారాన్ని వాంఛించడం మహాసభకు తగదు

*రాష్ట్రస్థాయిలోగల సంస్థ లేక సంఘము ఏదైనా - అది ఏ కులానికి చెందినదైనా - ఏ మతానికి సంబంధించినదైనా!*

రాష్ట్రములోగల ఆ కులము లేక ఆ మతానికి సంబంధించి కృషిచేస్తున్న ఇతర సంస్థలు లేక సంఘాలను ఉత్సాహపరచి, ఆర్థికంగానో - ఇతర విధముగానో సహకరిస్తూ, వాటి సత్వరగమనానికి 'చోదకశక్తి'గా వ్యవహరించాలి. ఆ ఇతర సంస్థలు లేక సంఘాలపై ధికారాన్ని చెలాయించడం కానీ, వాటిఉనికిని దురాక్రమణం చేయు ప్రయత్నము కానీ చేయకూడదు.

దాదాపు ద్వాదశవర్షముల క్రితము - అంతంత మాత్రంగా ఉన్న ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభకు అవసరమైన జవసత్వాలను గలిగించుట - మహాసభ - చోదకశక్తిగా పనిచేయాలన్న ప్రధానోద్దేశ్యముతోనే కానీ రాష్ట్రములో వివిధ నామాలతో సమాజాభ్యున్నతి గురిగా కృషిచేస్తున్న ఆర్యవైశ్యసంస్థల ఉనికిని దురాక్రమణ చేయాలని కాదు.

తిరుపతిలోని శ్రీమతిపంగులూరుసీతమ్మఆస్తుల సమస్య ఈనాటిది కాదు. పది, పద్నాలుగేండ్లుగా సాగు చున్నదే.

స్వర్గీయ కేసర్లరఘురాంగారు, తిరుపతి పట్టణములోని

వ్యా

క్షులుగా ఉన్నప్పుడూ - ఆ తర్వాత కూడ ఈ విషయాన్ని మహాసభ దృష్టికితేవడం జరుగుచూనేఉంది.

అయినా, మహాసభ ఈ విషయములో తగిన సముచితచర్య తీసుకోలేదు.

తిరుపతిలోని ఆర్యవైశ్య వృత్తి ఉద్యోగులసంఘమువారు ఈ సీతమ్మ ఆస్తుల సంరక్షణ విషయములో జరుగుచున్న జాప్యాన్ని గుర్తించి - తగిన ప్రయత్నాలను చేపట్టారు

వారి ఆ కృషిలో బాగంగా ఏర్పడ్డదే శ్రీ సుంకుబలరాంగారు అధ్యక్షులుగా శ్రీమతి పంగులూరుసీతమ్మట్రస్టు ఒకదశలో కోట్లాదిరూపాయల విలువచేసే సీతమ్మ భూములను కొన్ని లక్షలకు విక్రయించడం జరిగింది ట్రస్టు ఆ ప్రయత్నాన్ని శక్తివంతంగా ఎదుర్కొంది రాష్ట్రఉన్నతన్యాయస్థానములో సవాలుచేసి ఆ విక్రయాలను రద్దుచేయించింది

పూజ్యులు, సుప్రసిద్ద న్యాయవాదులు శ్రీ నంబూరురామమోహన్‌రావుగారు హైకోర్టులో ట్రస్టు విజయాన్ని సాదించుటకు స్వార్థరహితంగా ఎంతగానో సహకరించారు

శ్రీ రామమోహన్‌రావుగారు ఈ విషయంలో చేసిన కృషికి ఆర్యవైశ్యులు ఎన్ని రకాలుగా కృతజ్ఞతలు చెప్పినా - వారి ఋణాన్ని తీర్చుకోలేరు

ఈ భూములకు సంబంధించి ఇంకా పదకొండు వ్యాజ్యాలు న్యాయస్థానాలలో అపరిష్కృతంగానే ఉన్నాయి

హైకోర్టులో లభించిన విజయోత్సాహముతో ట్రస్టు ఆ ఆస్తులను ఆర్యవైశ్య సోదరులకు ఉపయోగపడేందుకు వీలైన పథకాలను రూపొందించుకొంటూంది ఒకవైపు కోర్టు వ్యవహారాలను నడుపుకొంటూనే

సీతమ్మ ఆస్తులను అభివృద్ధిపరచి - వైశ్య సమాజాభివృద్ధికి ఉపయోగపడునట్లు చేయుటకు అవసరమగు స్వతంత్ర ప్రతిపత్తిని ట్రస్టుకు కలిగించమని రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయశాఖను కోరడము జరిగింది ఆ కృషి ఫలించింది అనికూడ వార్తలు వస్తూ ఉన్నవి

కోట్లరూపాయల విలువగల భూములను లక్షలరూపాయలకే అమ్మకం చేస్తున్నపుడు శ్రద్ధచూపడము కానీ నైతిక సహకారాన్ని కానీ లేక ఆర్థిక సహకారాన్నికానీ అందించని ఆర్యవైశ్యమహాసబ సీతమ్మభూములపై అధికారానికి ఇప్పుడు అర్రులు చాస్తూ ఉంది

స్వతంత్ర ప్రతిపత్తిని పొందుటకు ట్రస్టుచేస్తున్న ప్రయత్నానికి కూడ ఇప్పటి అధ్యక్షులు అవరోధాలు కల్పిస్తున్నారని కూడ వార్తలు అందుచున్నవి

మూడు ఎకరాల భూమిని టి టి డి వారిని తీసుకొమ్మని మహాసభ తనంతతానే చెప్పడం మహాసభకుగల అదికారాన్ని ప్రశ్నార్థకం చేస్తూంది

అస్తవ్యస్తంగా ఉన్న సీతమ్మ ఆస్తుల వ్యవహారాన్ని ఎంతో శ్రమించి ఒకరూపానికి తెచ్చింది సుంకుబలరాంగారి నేతృత్వంలోని సీతమ్మ ట్రస్టు సీతమ్మఆస్తులపై అధికారము ఏదైనా ఉంటే అందునిమిత్తం ఏర్పడిన ట్రస్టుకే ఉంటుందేకానీ ఇతర ఏ సంస్థకూ లేదు అందువల్ల మహాసభకానీ మరే సంఘమైనా కానీ ట్రస్టుకు శక్తికొలదీ ఆర్థికంగా సహకరించాలే కానీ ఆ ఆస్తులపై అధికారాన్ని వాంఛించడము ఏవిధంగానూ అభినందనీయము కాదు హర్షణీయము అంతకన్నా కాదు ఒకరకంగా దురాక్రమణచేయాలనుకోవడం ఔతుంది

వైశ్యప్రబోధిని, డిశంబరు 1997

రాష్ట్రములో ఏ పేరుతో పనిచేస్తున్నా అట్టి సంఘాలను మరింత ఉత్సాహ పరచడమూ కుంటుపడిన సంఘాలకు పోరకశక్తిగా వ్యవహరించడమూ చేయుటకే మేమంతా ఆర్యవైశ్య మహాసభకు జవసత్వాలను కల్పించడము ఇతర సంఘములు చేస్తున్న కార్యకలాపాలకు అవరోదాలు కల్పించుటకూ, వాటిని వెనక్కి త్రోచిముందుకు వెళ్లి వాటి స్థానాన్ని దురాక్రమించుటకూ కాదు.

మహాసభకు పురోగమనశక్తిని సమకూర్చేందుకు ప్రయత్నాలు జరిగేనాటికి - ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభ అని వైశ్యులకు ఒకరాష్ట్రసంస్థ ఉన్నట్లుగా కూడ తెలియని ఇప్పటి అధ్యక్షుల మహాసభ పునరుత్థానములోని అంతర్యము తెలియక పోవుటలో విడ్డూరంలేదు

## ఆంధ్రప్రదేశ్‌లోని ఆర్యవైశ్యవృత్తి ఉద్యోగుల సంఘాలు (AVOPAS)

### జిల్లావారిగా

(గతసంచిక తరువాయి)

**9. ఖమ్మం జిల్లా** 4
ఖమ్మం, కొత్తగూడెం, పాల్వంచ, భద్రాచలం, యెల్లెందు

**10. కృష్ణా జిల్లా** 4
మచిలీపట్నం, విజయవాడ, గుడివాడ, జగ్గయ్యపేట

**11. కర్నూలు జిల్లా** 3
కర్నూలు, నంద్యాల, శ్రీశైలం ప్రాజెక్టు

**12. మహబూబ్‌నగర్ జిల్లా** 10
మహబూబ్‌నగర్, జడ్చెర్ల, షాద్‌నగర్, కల్వకుర్తి, అచ్చంపేట, కొల్లాపూర్, నాగర్‌కర్నూలు, గద్వాల్, వనపర్తి,

**13. మెదక్ జిల్లా** 5
సంగారెడ్డి, గజ్వేల్, మెదక్, జోగిపేట, సిద్దిపేట

**14. నల్గొండ జిల్లా** 3
హుజూర్‌నగర్,నల్గొండ, మిర్యాలగూడ

**15. నెల్లూరు జిల్లా** .
నెలూరు

**16. నిజామాబాద్ జిల్లా** 5
నిజామాబాద్, బన్సవాడ, కామారెడ్డి, యెల్లారెడ్డి, బోధన్

**17. ప్రకాశం జిల్లా** 5
చీరాల, ఒంగోలు, మార్కాపురం, గిద్దలూరు, అద్దంకి

**18. శ్రీకాకుళం జిల్లా** 1
శ్రీకాకుళం

**19. విజయనగరం జిల్లా** 1
విజయనగరం

**20. వరంగల్ జిల్లా** 7
వరంగల్, హనుమకొండ, పార్కల్, జనగాన్, చెరియాల్, మహబూబాబాద్, నరసంపేట

**21. పశ్చిమగోదావరి జిల్లా** 2
ఏలూరు, తణుకు

**మొత్తము** 100

(వాసవీప్రభ జూన్ 1997నుండి)

# ఆంధ్రదధీచి

చంద్రుపట్ల రామరావు (కన్యక నాటకకర్త)

"ఆంధ్రదధీచి జై"యని విహాయస మెల్ల ప్రతిధ్వనింప-దే
వేంద్రుడు స్వాగతంబిడి నతింప నుతింప విమానమెక్కె, నాం
ధేంద్రుడహో స్మశానమునకేగె శరీరము, నిర్నిరోధ నీ
రాంధ్ర మహోగ్ర విప్లవ హుతాశనకీలలు వెంటనంటిరాన్.

అదుగో తెలుగులు ముక్కోటి హృదయములను
జేర్చి శ్రీరాములకు చితి గూర్చినారు,
పౌరుషాగ్నితో దహన సంస్కారమయ్యె
తీర్చుకొన్నారు ఋణమును తెలుగువారు.

నాడువానరమూక చేతోడుగాగ,
నేడు విద్యార్థిబృందమే నిలువబడియె
నహహ శ్రీరాములకు విజయంబుగూర్చ
నాయకులు వినాయకులయినారు గాన,

దిగ్దింతాల నాంధ్రదధీచిపేర
తిష్ఠవేసిన దాంధ్రప్రతిష్ఠ, కాని,
ఆంధ్రజనయిత్రి గర్భదవానలంబు
రావణుని కాష్ఠమట్లు చల్లారదింక.

అపుడు స్వరాజ్య విప్లవనియంత మహాత్ముడు వైశ్యవీరుడే,
ఇపుడు స్వరాష్ట్ర విప్లవ ఋషీశ్వరుడాంధ్రుడు వైశ్యయోధుడే;
రిపుల నెదిర్ప ఖడ్గము ధరింపరు; నెత్తురుబొట్టునైన రా
లుపరు; ధరాధినాయకుల రోషము తోషముతో జయించిరో.

బ్రాహ్మణ-క్షత్రియుల ప్రాభవంబులుడిగి,
వైశ్యులే నేడు భారతబ్రహ్మ లైరి,
ఏ యుగమునందు కనివిని యెరుగనట్టి
సాత్విక నిరోధ యోగమే జయమునొందె.

పొట్టివాడుకాడు పొట్టి శ్రీరాములు
పొడవువాడె. నింగిపొడవువాడు,
పొట్టివడుగు వంటి పొట్టివాడేగాని
వట్టి పొట్టిగాడు, గట్టిసెట్టి!

వాసవీకన్య నేర్పిన పారమనుడు,
గాంధీజీత్రొక్కి చనిన మార్గంబెయనుడు
ఆత్మ బలిదానయోగంబు నాచరించి
జేతయైనాడు శ్రీరామజెట్టినేడు.

సేకరణ శ్రీ చంద్ర్మపట్ల బంగారురాజు (కవితనయులు) ఏలూరు

## అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవ "జూరి" మాస్టర్ ముడియం శ్రీచందన్



హైదరాబాదులో 10వ అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలు నవంబరు 14 నుంచి 23 వరకూ జరిగాయి. ఈ చిత్రోత్సవాలకు కడపజిల్లా నుంచి ప్రతినిధిగా హాజరైన తొమ్మిదేళ్ళ మాస్టర్ ముడియం శ్రీచందన్ "జూరీ" సభ్యునిగా ఎన్నిక కావడం కడప గడపకే గర్వకారణం.

చిత్రోత్సవాలకు హాజరయ్యే 300 మంది ప్రతినిధులలో కేవలం 12 మందిని "జూరికి"ఎన్నిక చేయడం, ఫిల్మ్‌ఫెస్టివల్ ఆనవాయితీ"జూరీ" సభ్యులలో శ్రీచందన్ అందరికంటే చిన్నవాడు కావడం విశేషం.

కడప నుంచి ప్రతినిధిగా హాజరై, జూరీ సభ్యునిగాఎన్నికైన ముడియంశ్రీచందన్, బాలజానపద నృత్యకళాకారుడుగా, రాష్ట్ర స్థాయిలో తన ప్రతిభను కనబరిచి, "మాస్టర్ ఆఫ్ ది డిస్ట్రిక్", "వాసవీ బాలరత్న", "ఉగాది పురస్కార్", లిటిల్ టాలెంట్ అవార్డ్", "జానపదరత్న" లాంటి అవార్డు లను స్వంతం చేసుకొన్నాడు.

శ్రీచందన్, కడప జీవితభీమా సంస్థలో పనిచేస్తున్న శ్రీముడియంకిషోర్‌కుమార్‌గారి కుమారుడు. ప్రొద్దుటూరులోని ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీముడియంకృష్ణమూర్తి గారి మనుమ డు.

☆☆

## వివాహం

కడప అవోపావిద్యానిధిఅధ్యక్షులు శ్రీకె.రామసుబ్బయ్యగారికుమారులు చి. రామకృష్ణారావు M Tech, గారి వివాహం రైల్వేకోడూరు వాస్తవ్యులు తల్లం రాధా కృష్ణగారి కుమార్తె చి. సరస్వతి B com, గారితో 12-11-1997వ తేదీన తిరుపతిలోని శ్రీపద్మావతీ కళ్యాణమండపములో వైభవంగా జరిగింది.

# "విప్లవ వీరుడు" దర్శి చెంచయ్య



శ్రీ బి లక్ష్మయ్యసెట్టి, ఎం ఏ, పిహెచ్‌డి,



భరతమాతను బ్రిటీష్‌వారి దాస్య శృంఖలాల నుండి విముక్తి కలిగించుటకు స్వాతంత్ర్య పోరాటంసల్పిన దర్శి చెంచయ్య విప్లవవీరుడు, సంఘసంస్కర్త, దేశభక్తుడు, సాహిత్యవేత్త.

చెంచయ్యగారు ప్రకాశంజిల్లా కనిగిరిలో క్రీ.శ 1890వ సంవత్సరంలో ఒక బీదవైశ్యకుటుంబమున జన్మించిరి. ఆ కాలంలో కనిగిరిలో ఎండాకాలంలో మంచి నీటికి కటకటగా ఉండేది. ఊరంతటికీ 'చుట్ట బావి' అనే చిన్నఊట మాత్రమే ఆధారం. వంతుల ప్రకారం నీరు తెచ్చు కోవడానికి 24 గంటల నుండి 36 గంటలు పట్టేది. తాసీల్దారుగారి నౌకర్లు మాత్రం వంతులు పాటించేవారుకారు. కాని ఒకనాడు కొంతమంది వైశ్యనాయకులు అందుకు అభ్యంతరం తెలిపారు. ఈ సంగతి తెలిసి క్రుద్ధుడైన తాసీల్దారుగారు వారిని కొట్టిరమ్మన్నారు. ఇలా పరాభవింప బడిన వారిలో చెంచయ్య గారి తండ్రిగారు కూడ ఉండిరి. బాలుడైన చెంచయ్య లేతమనసుపై ఈ సంఘటన గాఢముద్ర వేసింది. అతడు గౌరవంగా జీవించడ మెలా? అని ఆలోచించసాగాడు. "ఇంగ్లీషు చదువుకో నాయనా, తాసిల్దారు ఉద్యోగం చేస్తువుగాని, ప్రస్తుతం మన బ్రతుకు గౌరవంలేని బ్రతుకు" అని చెంచయ్య బంధువులు అతనిని చదువు కోవటానికి ప్రోత్సహించారు.

ఆ రోజుల్లో కనిగిరిలో నాల్గవతరగతి వరకు మాత్రమే చదువుకొనే అవకాశం ఉండేది. అందుచే నాల్గవతరగతి పూర్తి కాగానే చెంచయ్యకు వారితండ్రి ఒక చిల్లర దుకాణం పెట్టించాడు కాని చెంచయ్యకు అది నచ్చలేదు. తాసిల్దారు కావాలనే కోరిక అతనిలో మెదులుతూనే ఉంది అదే సమయంలో క్రీ. శ. 1903లో కనిగిరికి తుంపూడిభగవంతంగుప్త అనే వైశ్య తాసిల్దారు వచ్చాడు. అతనికి తక్కిన కులాలవారేగాక బ్రాహ్మణులు కూడ దండం పెట్టేవారు. ఇది చూసిన చెంచయ్య మనసులో గొప్పచదువులు చదవాలి. తాసిల్దారు కావాలనే కోరిక మరింత బలపడింది. బంధువులు కూడ బాగా ప్రోత్సహించారు అంతట చెంచయ్య "నాన్నగారూ! నన్ను ఒంగోలు పంపండి. పెద్దచదువులు చదివి తాసిల్దారవుతాను." అని తండ్రిని ప్రార్థించాడు. చెంచయ్యను వేరే ఊరికి పంపటం, ఇష్టంలేని వారి తండ్రి కనిగిరిలోనే ఒకస్కూలు పెట్టించి చెంచయ్యను సెకండుఫారం వరకు

చదివించాడు దర్శ్ఫారం చదువుటకు ఒంగోలు పంపాడు

ఒంగోలు స్కూలుహెడ్‌మాష్టరుగా నున్న కాళిదాసువెంకటసుబ్బయ్యగారు అడిగిన ప్రశ్నలకు సరిగా జవాబు చెప్పని విద్యార్థులనుబాగా శిక్షించేవారు. విద్యార్థుల జుట్టు పట్టుకొని, వంగదీసి బాదేవాడు. ఇది చూసి చెంచయ్య కలవరపడేవాడు. అట్టి శిక్షనుండి తప్పించుకొనుటకై చెంచయ్య కష్టపడి చదివేవాడు. 64 మంది విద్యార్థులు మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్ళగా చెంచయ్య ఒక్కడే ఉత్తీర్ణుడయ్యాడు. హైస్కూలులో గణితంలో నూటికి నూరు మార్కులు తెచ్చుకొంటున్న చెంచయ్య ఇంటర్‌లో గణితం, సైన్సు గ్రూపు చదవాలనుకొన్నాడు కాని ఆలస్యంగా వెళ్ళుటవల్ల మద్రాసులోని పచ్చియప్ప కళాశాలలో చరిత్ర, తర్కం గ్రూపుల్లో మాత్రమే సీటు దొరికింది. ఇష్టంలేని గ్రూపు కావటంచే అతడు ఏకాగ్రతతో చదువలేకపోయాడు .కష్టపడి బి.ఏ., చదువటంకన్నా, విదేశాలకు వెళ్ళివస్తే మంచి వేతనంతో కూడిన ఉద్యోగం వస్తుందని ఆలోచించాడు. ఆ రోజుల్లో విదేశాలకు వెళ్ళేవారిని కులము నుండి బహిష్కరించే వారు. అట్టి బెదిరింపులకు బెదరక, బంధువుల అయిష్టతను ఖాతరు చేయక చెంచయ్య ఉన్నత విద్యాభ్యాస మునకై అమెరికాకు బయలుదేరాడు. అతడు జపాన్ మీదుగా ప్రయాణంచేసి 1912వ సంవత్సరం డిసెంబరులో అమెరికా చేరాడు. కాలిఫోర్నియా యూని వర్శిటీలో ప్రవేశం పొందాడు పండిత హరదయాళ్ ఇంటిలో ఉండసాగాడు.

అమెరికాలోని భారతీయవిద్యార్థులలో చాలమంది భారతదేశ స్వాతంత్ర్యసిద్ధికై తీవ్రముగ ఆలోచించుచుండిరి. వారిలో రెండువర్గాలు ఉండేవి ఒకవర్గం మితవాద వర్గం రెండవది అతివాద వర్గం. మితవాద వర్గంవారు అమెరికాలో ఉన్నత విద్యను అభ్యసించి, ఇండియాకు వెళ్ళి ఉన్నత ఉద్యోగాల్లో చేరి బాగా సంపాదించు కొంటూ దేశానికి చేతనైన సహాయం చేయాలని తలచేవారు. కాని అతివాదులు బ్రిటీష్ ప్రభుత్వంతో పొరాడి స్వాతంత్ర్య మును సంపాదించాలని తలంచుచుండిరి. చెంచయ్య మితవాది.

ఒకసారి ఈ రెండువర్గాలను కలి పేందుకు ఒక సభ జరిగింది. ఆ సభలో పండితహరదయాళ్ అనునతడు ఈ విధంగా ఉపన్యసించెను "ప్రపంచ ప్రజానీకాన్నే బలిగొంటున్న బ్రిటీష్ సామ్రాజ్యవిధానానికి మన భారతదేశమే ఆయువుపట్టు. ఈ ప్రభుత్వాన్ని కూల ద్రోయాలన్న విధి మనదే. విముక్తికై పురోగామిలోకం మనవైపే చూస్తున్నది. ఇట్టి పైశాచిక ప్రభుత్వాన్ని కూకటి వేళ్ళతో పెకలించి పారవేయుటకు దేశభక్తులు, మానవాభ్యుదయాన్ని ఆకాంక్షించే మహా పురుషులు, మహావీరాధివీరులు కావాలి. ఈ కార్యాన్ని కొనసాగించడంకన్నా ఉత్తమ విద్య, పవిత్ర లక్ష్యం, మతం వేరేలేదు. విద్యార్థులారా! దేశభక్తి శిరోమణులని పించుకోండి."

పండిత హరదయాళ్ భారతదేశం నుండీ అమెరికాకు ఉన్నత విద్యాభ్యాసముకై వచ్చినవాడు. అతని ఉపన్యాసప్రభావం

బారతీయ విద్యార్థులపై బాగాపడింది. తర్వాత జితేంద్రనాథ్‌లాహరీ అనునతడు 1857 సంవత్సరమున జరిగిన గదర్ (సాయుధ సైనిక పోరాటం) విచ్ఛినం కావడానికి ముఖ్యకారణం, పంజాబీ సైన్యం బ్రిటీష్ ప్రభుత్వానికి సహాయం చేయటమే ననియు, అమెరికాలో రమారమి 15వేల మంది పంజాబీవ్యవసాయకూలీలు ఉన్నారనియు. వారందరినీ సంఘటిత పరచి ఒక విప్లవనిర్మాణకార్యక్రమాన్ని చేపట్టవలసిన అవసరం ఎంతైనా ఉంద నియు తెలిపాడు. తత్ఫలితంగా 1913వ సంవత్సరం ఆరంభంలో 'గదర్‌పార్టీ' పుట్టింది. ఆ పార్టీ కార్యాలయం సేన్ ఫ్రాన్సిస్కో నగరంలో స్థాపించబడింది. ఆ పార్టీ స్థాపకులలో చెంచయ్య దక్షిణ భారత దేశమంతకూ ఏకైక ప్రతినిధి.

గదర్‌పార్టీ ఒక పత్రికనుకూడ నడిపింది అది దేశదేశాలకు ప్రాకిపోయింది. ద్రవ్య సహాయం విస్తారంగా లభించసాగింది. వాలంటీర్లసహాయం విస్తారంగా ఏర్పడింది. అనేకులు వచ్చి పనిచేయసాగారు. అనేక దేశాల్లో అనేకచోట్ల గదర్‌పార్టీ ఆఫీసులు ఏర్పడ్డాయి.

లాహరీ స్వాతంత్ర్యంకొరకు ప్రాణ త్యాగంసయితం చెయుటకు సంసిద్ధులైన విద్యార్థులందరికీప్రత్యేకంగా ఒకహాస్టలును పెట్టించాడు. చెంచయ్య అందులో చేరాడు. లాహరీ చెంచయ్యకు టెరరిజం, గొరిల్లా యుద్ధవిమానం, కత్తిసాము, కుస్తీ, బాక్సింగు, తోటాలు చేయుట, రివాల్వరు, తుపాకీలు ప్రేల్చుట మొదలగు వాటిలో శిక్షణను ఇచ్చాడు.

గదర్‌పార్టీ ఆలోచనా సరళిని అనుస రించిచెంచయ్య లోగన్‌టవున్‌లో యూటా రాష్ట్రపువ్యవసాయకాలేజీలో చేరాడు వర్షాధారపంటలను గురించియు, మిలటరీసబ్జెక్టును గురించియు అధ్య యనం చేయసాగాడు. 1915 మే నెలలో గదరుపార్టీవారు చెంచయ్యను జపాన్ మీదుగా ఇండియాకు బయలుదేర మనియు, జపాన్‌లో భవిష్యత్ కార్యక్రమ మును గూర్చి తెలుపబడుననియు చెంచయ్యకు చెప్పారు. చెంచయ్య అమెరికా వదలి జపాన్‌కు బయలుదేరే స్టీమరు ఎక్కాడు. 12 రోజులు ప్రయాణం తర్వాత జపాన్ చేరాడు. జపాన్‌లో సన్‌యట్‌సేన్‌ను కలిశాడు. మనీలా వెళ్ళి అక్కడిజర్మను మిలిటరీ ఆఫీసర్లను, రాయ బారిని కలిసి భవిష్యత్ కార్యక్రమమును తెలుసుకొన వలసినదిగా చెప్పారు. ఆ ప్రకారం చెంచయ్య మనీలా వెళ్ళి వారిని కలిశాడు. వారు బర్మాను పట్టుకొనుటకు గాను ఎంపికచేసిన 8 మందిలో చెంచయ్య ఉన్నట్లు తెలిపారు.

వారు చెప్పిన ప్రకారం చెంచయ్య మనీలానగరంనుండి ఒకస్టీమర్లో బయలుదేరి సయాంలోని బాంకాక్ చేరాడు. బాంకాక్‌లో ఒక పంజాబీ మిఠాయి కొట్టు యజమాని ఆతిథ్యం పొందాడు. అక్కడ పోలీసులు చెంచయ్యను అరెస్టుచేసి విదేశీయులు జైల్లో పెట్టారు. చెంచయ్య తప్పించుకోవటానికి ప్లాను వేశాడు. కాని ఆ ప్లాను విజయవంతం కాలేదు. రెండు నెలల తర్వాత సింగపూరు నుండి మిలిటరీ పోలీసుదళం వచ్చి చెంచయ్యకు సంకెళ్ళు వేసి స్టీమర్లో సింగపూరుకు తీసుకొని వెళ్ళింది.

(ఇంకావుంది)

వైశ్యప్రబోధిని, డిశంబరు 1997

# క్విట్ ఇండియా ఉద్యమ వీరులు బెల్లంకొండ నారాయణ



శ్రీ గూడూరు సుబ్రమణ్యము , అనంతపురం
సేకరణ శ్రీబి వెంకటసుబ్బయ్య
సంపాదకులు పెన్నెనర్ ప్రగతి. అనంతపురం.

భారతస్వాతంత్ర్య ఉద్యమాలలో రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యమును కుదిపివేసి, గడగడలాడించిన చారిత్రక ఘట్టాలు ఎన్నెన్నో వున్నాయి. వాటిలో "క్విట్ ఇండియా" ఉద్యమం చివరిది. ఈ ఉద్యమ ప్రభావంతోనే రెండవ ప్రపంచ యుద్ధం సందర్భంగా నేతాజీసుభాస్‌చంద్ర బోస్ "అజాద్ హింద్ ఫౌజ్" (భారత స్వాతంత్ర్య సైన్యము)ను ఏర్పరచి, బ్రిటీష్ ప్రభుత్వానికి సింహస్వప్నంగా నిలిచినారు

1942 ఆగష్టు 9న బొంబాయిలో జరిగిన భారతజాతీయ కాంగ్రెసుసమావేశంలో గాంధీజీ "క్విట్ ఇండియా" తీర్మానాన్ని ప్రతిపాదించిరి. భారతదేశాన్ని పాలిస్తున్న బ్రిటీష్ ప్రభుత్వం వెంటనే తొలగి పోవాలని దాని అర్థం. ఈ ఉద్యమ నిర్వహణలో (DO or DIE) "చావో బ్రతుకో" అన్న నినాదాన్ని గాంధీజీ ఆ వేదిక నుండే ప్రబోధించారు. ఈ తీర్మానంతో ఖంగుతిన్న బ్రిటీష్‌ప్రభుత్వం రాత్రికి రాత్రే స్వాతంత్ర్యోద్యమ నాయకులందరినీ జైళ్ళలో బంధించింది. నాయకులు లేకున్నా సుశిక్షితులైన కార్యకర్తలు కట్టలు తెంచుకొని ఉవ్వెత్తున లేచిన సాహసోపేతమైన ఉద్యమాన్ని నడిపినారు. ఆ ఉద్యమంలో పాల్గొని, కఠోర శిక్షను అనుభవించిన శ్రీబెల్లంకొండనారాయణసెట్టి రాష్ట్రస్థాయిలో గొప్ప నాయకునిగా గుర్తించబడినారు. పేదరికంలో జన్మించి, నిస్వార్థపరునిగా, ఆదర్శ గాంధేయవాదిగా జీవించి, చివరకు పేదల కోసమే తుది శ్వాస వదలిన ఉత్తమవ్యక్తి నారాయణసెట్టి ధర్మవరం తాలుకాలోని గంతిమర్రి గ్రామం లో బెల్లం కొండవెంకటప్ప, వెంకటమ్మ పుణ్యదంపతులకు జన్మిం చిన ముద్దుబిడ్డడు నారాయణ సెట్టి. చదివింది ప్రాథమిక విద్యయైనప్పటికీ అపార మైన సాంఘిక నీతిశాస్త్రాన్ని అధ్యయనం చేసిన మేధావి ఆయన. పూట పస్తులతో బాధపడుతున్న కుటుంబ పోషణకు 1928లో తన 18వ ఏట కుంటి మద్దిచేరి, స్వాతంత్ర్యసమరయోధుడు వేములవెంకటరంగయ్య సలహా ప్రకారం కాంగ్రెసు సభ్యత్వము పొందినారు. తిరుపూరి నుండి ఖద్దరు తెప్పించి, గ్రామ గ్రామం తిరిగి, ఖద్దరుధారణను ప్రోత్సహించుచూ, కాం గ్రెసు పార్టీలో సభ్యులను

చేర్పించుచూ, రాజకీయాలను బోధిస్తూ, స్వాతంత్ర్యోద్యమ ప్రచారము గావించిన నిఖారసు కార్యకర్త ఆయన. ఆ తరువాత కుంటిమద్ది కో- ఆప రేటివ్ సొసైటిలో గుమస్తాగా చేరి, రైతులకు నిస్వార్థంగా ఋణాలు మంజూరు చేయిస్తూ, రైతు బాంధవుడుగా ప్రజాహృదయాలను చూర గొన్నాడు.

1939లో జరిగిన రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటీష్ ప్రభుత్వం భాగస్వామి అయింది. యుద్ధనిధికి భారత ప్రజల నుండి నిర్బంధంగా ధనాన్ని వసూలు చేయబూ నింది. జస్టిస్‌పార్టీనాయకులు ప్రభుత్వ అనుకూలురుగాన యుద్ధనిధి వసూళ్ళకు చేయూత నివ్వగా, ఆ యుద్ధమునకు ఏవిధ మైన సహాయ సహకారాలనివ్వరాదనీ, యుద్ధనిధి వసూళ్ళను వ్యతిరేకించాలనీ కాంగ్రెసు పార్టీ తీర్మానించి, సహాయ నిరాకరణ ఉద్యమానికి పిలుపు నిచ్చింది. ధర్మవరం తాసీల్దారు బృందం కుంటిమద్దికి వచ్చి యుద్ధనిధిని నిర్బంధముగా వసూలు చేయసాగింది. అప్పుడు విద్యార్థిగా వున్న నారాయణసెట్టి తన తమ్ముడు వెంకట సుబ్బయ్యకు పసుపు, కుంకుమ, గాజులు ఇచ్చి తాసీల్దారుకు ఇమ్మని పంపెను. ఆ విద్యార్థి ఖద్దరుటోపి ధరించి తాసీల్దారు వద్దకు వచ్చి "తొలగి పొండి తెల్లోళ్లు. మీ తావులకు మీరు.' అనే పాటపాడి, "మీరు నిజమైన భారతీయులైతే మీ పదవికి రాజీనామాఇచ్చి, దేశమాత విముక్తికి పాటుపడండి. లేనిచో పసుపు, కుంకుమ, గాజులు ధరించండి." అని తాసీల్దారుతో అనడంతో ఆయన నారాయణసెట్టి గారిని పిలిపించాడు. "పొట్టకూటికి ఉద్యోగం చేస్తున్నాము. మాకూ దేశభక్తి వుంది. మేము కూడా పరోక్షంగా స్వాతంత్ర్య ఉద్యమానికి సహకారమిస్తామని భాధతో పలికారు. "నారాయణసెట్టి లాంటి దేశభక్తులు పది మంది వుంటే చాలు. స్వరాజ్యం త్వరలో వస్తుం దని"చెబుతూ, యుద్ధనిధి వసూళ్లకు స్వస్తి చెప్పి వెళ్లారు. నైతిక బలంతో మన సులు మార్చగలవారు నారాయణసెట్టి.

1940లో వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమానికి పూజ్యబాపూజీ పిలుపు ఇచ్చారు.మహాత్ముని అనుమతి లభించగానే నారాయణసెట్టి 1941లో దాదులూరు గ్రామంలో ఉద్యమ సందర్భంలో హరిజన సహపంక్తి భోజనాలు ముగింపజేసి, సత్యాగ్రహం చేశారు. "బ్రిటీష్ వారుచేయు యుద్ధమునకు ధనసహా యముగానీ,జనసహాయముగానీ చేయుట తప్పు" అని ఎవరైనా ఒక సత్యాగ్రహి ప్రక టించగానే, ప్రభుత్వం అతనిని అరెస్టుచేసి శిక్షిస్తుంది. అయితే నారాయణసెట్టిని మాత్రం అరెస్టు చేయలేదు. ఆయన ఇంటికి రాకుండా, అట్లే "ఢిల్లీ ఛలో" ఉద్యమంలో పాల్గొని, కాలినడకతో గ్రామగ్రామం పర్యటిస్తూ, ఉద్యమ రాజకీయాలు ప్రచా రం చేస్తూ విజయవాడ చేరారు. ఇంతలో ఢిల్లీ ఛలో ఉద్యమాన్ని విరమించిన కారణంగా ఆయన ఇంటికి చేరారు.

1942లో క్విట్ఇండియా ఉద్యమం తీవ్రరూపం దాల్చుడంతో బ్రిటీష్ ప్రభుత్వం స్తంభించి పోయినది ఉద్యమకారులను రాక్షసత్వంతో శిక్షించారు. ఫలితంగా నారాయణసెట్టి ఉద్యమకారులతో కలిసి, నాగసముద్రం రైల్వేస్టేషన్ వద్ద రైల్వేటెలి ఫోను తీగలను త్రెంపివేశారు. ఆ మరునాడు ఉదయమే దాదాపు నూరుమంది పోలీసులు కుంటి మద్దిని ముట్టడించి, ఉద్యమ కారులను అదుపులోకి తీసుకున్నారు. ప్రభుత్వవ్యతిరేక ఉద్యమంలో చేరము అని, ప్రభుత్వానికి విధేయులై యుంటామని వ్రాసి ఇమ్మని పోలీసు అధికారులు హూంకరిస్తుండగా, నారాయణ సెట్టి, వెంకటాచలం గార్లు "తీగలు త్రెంపింది మేము. మమ్ములను అరెస్టు చెయ్యండని" ధైర్యంగా ముందుకు వచ్చి అరెస్టయిరి. కేసు విచారణ సందర్భంగా ఆనాటి డిప్యూటీ కలెక్టరు శ్రీఅప్పస్వామిసెట్టి "ఇట్టి చట్ట విరుద్ధ మైన చర్యలు చేపట్టమని మీ నాయకులు ఆదేశి...రా?" అని ప్రశ్నించగా దానికి వీరిద్దరూ "సీత జాడకై వెళ్లిన హనుమంతుడు, రాముని సైనిక బలాన్ని చూపించుటకు లంకను కాల్చాడు. అట్లాగే మానాయకులను బంధించిన బ్రిటిష్‌ప్రభుత్వానికి మా నాయకుల బలమేమిటో చూపించుటకు ఈ పని చేశాము" అని ధైర్యంగా జవాబిచ్చిరి. దానితో 1942 అక్టోబరు 21న వారు ఆరు నెలల కఠినకారాగారం. 15 పేము బెత్తం దెబ్బల (విప్పింగ్) శిక్షకు గురియైరి.

ఆనాటి ఐక్యమద్రాసురాష్ట్రంలో ఇంతటి కఠినశిక్షకు గురికాబడిన వారు వీరిద్దరే ఎత్తైన ముక్కాలిపీటకు వీరిని బంధించి పిరుదులపై లోషన్ గుడ్డవేసి (కొట్టే దెబ్బలకు చర్మం పగలకుండగను, బాధ ఎక్కువగా ఉండునట్లును) పేము బెత్తంతో కొట్టు శిక్షలో మొదటిదెబ్బకే స్పృహతప్పి పడపోయారంటే ఎంత గట్టిగా కొట్టినారో ఊహించవచ్చు. దెబ్బలు కొట్టె వాడికి ఒక్క దెబ్బకు ఆనాటి కూలి అర్ధరూపాయి: అంటే ఎంత గట్టిగా కొట్టాలో ఇట్టే తెలుసుకొవచ్చు ఆ దెబ్బలతో వారికిక మూడు రోజుల తర్వాత స్పృహ వచ్చింది. భరించలేని బాధ. సహించనిపురుగుల అన్నం. చిలము కాసిన చారు. వీటిని తినడంతో రక్తవిరేచనాలతో ఆరోగ్యం చెడింది. వైద్యసహాయం అంతంతే! వారు యమయాతనలు పడ్డారే కాని "ఇంక స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనము'అని క్షమాపణపత్రం మాత్రం వ్రాసి ఇవ్వలేదు. ఆ విధంగా కఠిన శిక్ష అనుభవించి బయట పడ్డారు. జైలులో 'అపాలజీలు' వ్రాసి ఇచ్చి, బయట గొప్పనాయకులుగా ఫోజులు పెట్టి, ఆస్తులు పెంచుకొన్న స్వార్థపరులూ ఆనాడు లేకపోలేదు.

- వైశ్యప్రబోధిని, డిశంబరు 1997

గాంధీగారి నిర్మాణ కార్యక్రమాలలో హరిజనోద్ధరణ ఒకటి. వీరి నేతృత్వంలో కుంటిమద్దిలో హరిజనపేద విద్యార్థులకు విద్యా వసతి సౌకర్యాలు సమకూర్చబడినవి ఒకసారి గంతిమర్రిగ్రామ హరిజనులు

కరువు కారణంగా ఉగాదిపండుగ చేసుకో లేదని గ్రహించిన నారాయణసెట్టి తనకు వచ్చిన వేతనంతో బియ్యం, టెంకాయలు అన్ని కుటుంబాలకు ఇచ్చి, వారంతా భోజనాలు చేసిన తర్వాత తాను భోజనం చేసిన విషయాన్ని ఇప్పటికీ కథలుగా చెప్పుకుంటారు ఎక్కడకు వెళ్ళినా హరిజన సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయించే వారు ఈ విధంగా హరిజనసేవతో పొట్టి శ్రీరాముల గారికి వారసులు అనిపించు కున్నారు

హిందూపురం సేవామందిర నిర్మాత పూజ్య లింగణ్ణగారు నారాయణసెట్టి, వెంకటాచలం గార్ల సేవాకార్యక్రమాలను విని, ఖద్దరునేతశిక్షణకై వారిని మచిలీ పట్నంకు పంపిరి వెంకటాచలంగారు కుంటిమద్దిలో 'జై భారత్ ఖాదీ భాండారు' స్థాపించి, ఖద్దరువ్యాప్తికై తోడ్పడిరి నారాయణసెట్టిని లింగణ్ణగారు సేవా మంది రంలో ఖద్దరు ప్రచారకునిగా నియమించగా, 24 గ్రామాలలో ఆయన సల్పిన కృషికి ముగ్ధులైన లింగణ్ణ పలు పర్యాయాలు సెట్టి గారిని "ఆదర్శ కార్యకర్త" అని ప్రశం సించిరి

1947 ఆగష్టు 15న భారతదేశం స్వతంత్ర మైంది కాని, మైసూరు సంస్థానము స్వతంత్రం కాలేదు దానికై బ్రహ్మాండంగా పోరాటం జరగడంతో సేవామందిరం ఒక సత్యాగ్రహ శిబిరంగా తయారయింది పూజ్యలింగణ్ణ, యం ఏ - పరుశురాంగార్ల నాయకత్వంలో జరిగిన ఆ పోరాటానికి కుంటిమద్ది కూడా ఒక ఉపకేంద్రంగా వెలసింది జిల్లా కమ్యూనిష్టునాయకులు ఐ సదాశివన్, నారాయణసెట్టిగార్ల నాయ కత్వంలో మైసూరు రాష్ట్రానికి స్వతంత్రం సిద్ధించే వరకూ అనేక పోరాటాలు జరిగినవి "తిరుమణి పోలిసు స్టేషన్ ముట్టడి" అనే చరిత్రాత్మక ఘట్టం వీరల ప్రోత్సాహంతో జరిగిందే

1957లో పోర్చుగ్రీసు పాలనలో గల గోవా, డయ్యు, డామన్ ప్రజలు స్వాతంత్ర్య పోరాటం సాగించారు ఆ పోరాటానికి మద్దతుగా భారతభూభాగం నుండి తండోప తండాలుగాసత్యాగ్రహులు వెళ్ళారు నాటి గోవాపాలకుడు "సాలాజార్" విచక్షణా రహితంగా సత్యాగ్రహులను కాల్పిస్తూ భయానకాన్ని సృష్టించాడు గోవా ప్రజల దాస్యవిముక్తిఉద్యమంలో పాల్గొనుటకు నారాయణసెట్టి, వారి అర్ధాంగి శ్రీమతి జయలక్ష్మమ్మ గారలు అనంతపురం నుండి ఒక దళంతో వెళ్లి, మరణానికి వెరవకుండా నియంతకు పోటీగా నిల బడ్డారు దానితో త్యాగానికి మారుపేరుగా వీరు కీర్తించబడిరి నాటి ప్రధాని నెహ్రూ పట్టుదలతో గోవా విముక్తి పొందిందని అందరకు తెలిసిందే

తాను గాంధేయవాదియైనా ఆదర్శ కమ్యూనిష్టులుగా గుర్తించబడిన సదా శివన్, నాగిరెడ్డి, జి రామకృష్ణ, వి.కె ఆదినారాయణరెడ్డిగార్లకు నారాయణసెట్టి చాలా ఆప్తులు 1952లో కమ్యూనిస్ట్ పార్టీ

నాయకత్వంలో జరిగిన సివాయిపాగు (ప్రభుత్వం భూములు) భూముల పంపక పోరాటంలో భాగస్వామియై కుంటిమద్దివ చుట్టు పక్కల పల్లెలోని భూస్వాము లాధీనంలోని వేలాది ఎకరాల ప్రభుత్వ భూములను విడిపించి పేదలకు పంచు టలో గొప్పకృషి చేసిరి.ఆ ఉద్యమం ద్వారా నడిపిన కర్నూలు యాత్రలో ఈయన కూడా ఒకదళానికి న్యాయకత్వం వహించిరి. అలానే, గీతకార్మిక సత్యాగ్రహాలు నడి పించిరి. అధిక శిస్తులు మాఫీకై నడిపిన పోరాటానికి నాయకత్వం వహించి, తన భార్యతో పాటు జైలు పాలైరి. ఇంటిలోని సామానులన్నీ వేలానికి గురియైనా జంకక, ప్రజా పోరాటాలన్నింటిలో అగ్రగాములుగా నిలిచి, పూట పస్తులతో నిష్కలంకంగా బ్రతికిన సేవాదురంధరుడు ఈయన.

వీరికి మూఢనమ్మకాలపై నిరసన, కుల మత భావాలపై ఉక్రోషం హెచ్చు. ఈయన యదార్థవాది. తాను నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి పని చేయడం ఈయనకు వెన్నతో పెట్టిన విద్య. ఈయనకు మూఢనమ్మకాలంటే గిట్టవు. కుల, మత చిహ్నమైన యజ్ఞోపవీతాన్ని తీసివేసి మానవునిగా జీవించారు. ఒకసారి కుంటిమద్దిలో ఒక సంపన్నకుటుంబీకుడు తన తల్లి మరణ సందర్భముగా వైకుంఠ సమారాధన జరిపించాడు. బ్రాహ్మణులకు అష్ట దానాలు ఇస్తే తన తల్లి వైతరణీ నది దాటి, స్వర్గలోకం చేరుతుందనే భావనతో పురోహితులకు దానాలిచ్చే సమయంలో నారాయణసెట్టి విరేచనాలు నిలుచుటకు యిచ్చేగుళిక తీసుకొని అక్కడకు వెళ్లాడు. "మాతల్లి మలబద్ధక రోగముచే చనిపో యింది పురోహితులంతా ఈ గుళికలు మింగితే మా తల్లికి మలబద్ధకం పోయి, వైతరిణీ నది దాటుతుంది తీసుకొండి" అని చెప్పడంతో వారంతా హతాశు లయ్యారు

పూజ్య బాపూజీ హత్యానంతరం ఆచా ర్యవినోబాభావే అధ్వర్యంలో సర్వోదయ సంస్థ ఏర్పడింది. గాంధేయవాదులంతా అందులో చేరి. గాంధీ సిద్ధాంతాల వ్యాప్తికి కార్యక్రమం చేపట్టిన నేపథ్యంలో భూదానో ద్యమం ఉద్భవించింది. ఆ ఉద్యమంలో చేరిన నారాయణసెట్టి కుంటిమద్దిలో గ్రామ స్వరాజ్య శిక్షణాశిబిరాన్ని నడిపి, ప్రభాకర్‌జీ, సాధుసుబ్రహ్మణ్యం, చెలిమన్‌థామన్, గోరాజ్, ఉమ్మెత్తల కేశవరావు గార్లను ఆహ్వానించి ఆదర్శంగా శిబిరాన్ని నిర్వహించిరి. భూదానఉద్యమ భూము లను అర్హులైన పేదలకు పంచుటలో నారాయణసెట్టి గారి నిష్కళంక పాత్ర భావితరాల వారికి ఆదర్శము.

తన 18వ ఏట అనగా తొలి యౌవన దశలో రాజకీయాలలో ప్రవేశించి, తన 67వ ఏట తుదిశ్వాసవిడుచువరకూ నిర్విరామ ప్రజా సేవా కార్యక్రమాలు జరిపి, మచ్చలేని మనిషిగా జీవించారు. భోగాలకు దూరంగా వుంటూ, పదవులు ఆశించక రాజకీయలబ్ధితో పరాన్నభుక్కుడు గాక, త్యాగమే ఊపిరిగా, న్యాయమేశక్తిగా మసలుచూ, నిరాడంబర జీవిగా దారిద్ర్యాన్ని వరించి జీవించినాడు. కేంద్ర ప్రభుత్వం వీరిని స్వాతంత్ర సమరయోధునిగా గుర్తించి, తామ్ర పత్రాన్ని ప్రదానం చేసింది.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 డిసెంబరు 21 నుండీ 1997 జనవరి నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| సోమవారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| మంగళవారము | 23 | 30 | 6 | 13 | 20 | |
| బుధవారము | 24 | 31 | 7 | 14 | | |
| గురువారము | 25 | జనవరి 1 | 8 | 15 | | |
| శుక్రవారము | 26 | 2 | 9 | 16 | | |
| శనివారము | 27 | 3 | 10 | 17 | | |

డిశంబరు 25 :- క్రీస్తు జన్మదినం (క్రిస్టమస్ పండుగ) దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవుదినము.

డిశంబరు 29 - పూర్వాషాఢ కార్తె రాక ఉ 8.00

| | | |
|---|---|---|
| డిశంబరు | 31 :- | పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1997 నవంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించిన ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరితేది. |
| డిశంబరు | 31 :- | 1997 నవంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరుతేది |
| జనవరి | 1 :- | ఆంగ్ల సంవత్సరాది. రంజాన్ నెల ప్రారంభం |
| జనవరి | 8 :- | ముక్కోటి ఏకాదశి. |
| జనవరి | 9 .- | సింధునది పుష్కరం |
| జనవరి | 10 :- | శుక్రమౌఢ్య.ఆరంభం |
| జనవరి | 12 :- | వివేకానంద జయంతి - ఉత్తరాషాడ కార్తె రాక ఉ 8.36 |
| జనవరి | 13 :- | భోగి |
| జనవరి | 14 :- | మకరసంక్రాంతి. ప 2-48, ఉత్తరాయణం ప్రారంభం |
| జనవరి | 15 :- | కనుమ |
| జనవరి | 15 :- | చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు. |
| జనవరి | 15 :- | శుక్రమౌఢ్య నివృత్తి |
| జనవరి | 20 :- | A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరిరోజు. |

**21, 28, 4, 11, 18 ఆదివారాలు**

- *నన్ను మీ టేబులుపై ఉంచుకోండి ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను*

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము శ్రీ పి లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

గత సంచిక తరువాయి

## పదకొండవ అధ్యాయము

పరమేశ్వరి 'వాసవి' అను పేర కుసుమార్యునికి బిడ్డగా జన్మించినదని తెలుసుకొని, బంధువులూ ప్రజలూ సంతోషించిరి కాంతిసంపత్తి ఆ బిడ్డలు ఇద్దరూ దిన, దినమూ వృద్ధి బొందిరి.

48 1/2 - 49 1/2 305

విరూపాక్షుడు పంద్రెండు సంవత్సరముల వయస్సు కలవాడాయెను. కుసుమ శ్రేష్ఠి వేదోక్త విధానమున ఉపనయనమును చేసెను. భాస్కరాచార్యుడు ఆ విరూపాక్షునిచే మూడువేదములనూ చదివించెను. గురువును నిమిత్త మాత్రముగా చేసికొని ఆ విరూపాక్షుడు అరువదినాలుగు విద్యలనూ అతి శీఘ్రముగ్గా స్వయముగా అభ్యసించెను.

50 - 52 - అ -29 - పుట 309

(వాసవి గురువుల యొద్ద శ్రద్ధ, భక్తులతో మెలగి సర్వవిద్యలూ నేర్చుకొనెను. ఆమె ఏకసంతాగ్రహి. అందువలన గురువులు ఒకసారి చెప్పిన చాలును. .అందలి సారము సర్వమూ అమెకు స్పష్టముగా అవగతమయ్యేది. సంగీతములో కూడ మంచి ప్రజ్ఞను సాధించెను. ఆమెకంఠమాధుర్యమునకు చిలుకలు, కోయిలలూ సిగ్గుపడేవి.)

చక్కని చిగురులతో కూడిన సౌభాగ్యము కలిగిన మాకందలత వలె వాసవి కీర్తితో గూడ యౌవన సంపదను పొందెను

50 - 53 (296 - పుట 307)

(వాసవి ప్రతిరోజూ బ్రహ్మముహూర్తమున మేల్కొని, నిత్యకృత్యములు తీర్చుకొని, ప్రాతఃకాలముననే జగదంబశ్రీకన్యకా పరమేశ్వరీదేవి ఆలయానికి వెళ్ళేది అచ్చట ఆ దేవీవిగ్రహము ఎదుట ధ్యానములో కొంత కాలము గడిపేది. అర్చకులు చేయు అర్చనలో, వారితో తన గొంతును కలిపి వేదమంత్రములను పలికేది. వాసవి బయటకు వెళ్ళినపుడు ముదుసలులను, రోగ పీడుతులనూ, చూచి ఎంతగానో విచారించేది. మానవులు ఎందుకు ఈ విధంగా రోగపీడితులగుచున్నారు. ముసలితనంతో బాధించబడుచున్నారు. వీటికి పరిష్కారమే లేదా? అని ఆలోచిస్తూ ఉండేది.)

ఇది స్కాందపురాణము మందు - సనత్సుజాతీయ సంహిత గల ఉత్తర ఖండము - విరూపాక్ష, వాసవీ కన్యకల జననమును చెప్పెడి పదకొండవ అధ్యాయము.

## పండ్రెండవ అధ్యాయము

సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పిన విధమును సాలంకాయనుడు వైశ్యబుషులకు ఇట్లు చెప్పుచున్నాడు.

చిత్రకంఠుడు అను పేరు గల

గంధర్వుఁడు (ఆదిశక్తి యొక్క శాపము వలన), భూలోకము నందు విజయార్కుఁడు అను రాజుకు పుత్రుడై విష్ణువర్ధనుడు అను పేరుతో ఒప్పి యువరాజ్యమును పొందెను.)

అతడు షడంగములతో కూడిన సకల వేదములనూ, షట్శాస్త్రములనూ, ధనుర్వేదమునూ, అరవైనాలుగువిద్యలనూ, అభ్యసించెను. తర్వాత యౌవనమును పొంది అర్బుదసంఖ్యగల మదగజములతో, సముద్రములను దాటుటకు సమర్థము లైనట్టి అరట్టదేశపు గుఱ్ఱములతో, సింహ పరాక్రమము కలిగి మహావీరులై ఆకార మును పొందిన పరాక్రమమువలె ఉండు లెక్కకు మించిన మహాభటులతో జయ శీలుడగు ఆ విష్ణువర్ధన రాజు ఒకప్పుడు దిక్కులను జయింపవలెను అను కోర్కెతో ప్రయాణమాయెను.

14 1/2 - 17 1/2 అ.30 - పుట 311

తన కుమారుడగు రాజరాజేంద్రుని రత్నమయములైన ప్రాకారాలతోనూ, పుర ద్వారాలతోనూ, ఒప్పి యుండు 'పద్మ శయనము' అను పేరుగల తన పట్టణ మునందు ఉండు చతురంగ బలములతో కూడి ఉండునట్లు చేసి విష్ణువర్ధన మహారాజు తాను బలగములచే భూమిని కంపింపచేయుచు తూర్పు దిక్కునకు విజయయాత్రకై బయలు దేరెను.

18 -19 1/2 అ. 30- పుట. 313

బలముచే గర్వితులైన వంగదేశ రాజులనూ, అంగదేశ రాజులనూ, కళింగదేశ రాజులనూ, సింహళదేశ రాజులనూ తన ధనస్సు నుండి వెలువడు తీక్ష్ణములైన బాణములచే నొప్పించి, సైన్యముతో కూడిన, ఆ రాజులందఱనూ తన బలము శౌర్యముచేత స్వాధీనము చేసుకొని, ఎక్కువ ధనము గల కోటలను కొల్లకొట్టి, తనకు 'శరణు' అన్న రాజులకు తిరిగి ఆ కోటలను పరిపాలించుకొనునట్లు చేయుచూ, విష్ణు వర్ధనరాజు అచ్చటి నుండి దక్షిణ దిక్కునకు బయలుదేరి పోయెను.

20 - 22 - 1/2 అ.30 - పుట 313

ఆ దక్షిణదిక్కునందుండు చోళ రాజులూ, శకదేశపు రాజులూ, పాండ్యదేశ రాజులూ, తుండీరదేశ రాజులూ, మదము తో కూడిన వనచరవీర సైన్యములతో యుద్ధభూమి యందు విష్ణువర్ధనుని ఎదు ర్కొనిరి. ఆ చోళదేశాధి రాజుల సేనలకూ, విష్ణువర్ధనుని బలములకూ ప్రళయ కాలమందు దక్షిణ, ఉత్తర సముద్రములకు పొసగినట్లు గొప్ప సంగరము అయ్యెను. గొప్ప సమ్మర్ధము కలిగెను. సూర్యుని మ్రింగుచున్న రాహువు వలె, నాలుగు సముద్రములను బురదగా చేయునట్లుగా ధూళి ఎల్లెడల కప్పెను.

23 - 25 1/2 అ. 30 - పుట 313

విష్ణువర్ధన రాజు ధనస్సుకు అల్లెత్రాటిని కూర్చి, శరవర్షమును కురిపిస్తూ ప్రళయ కాలమందలి మేఘధ్వనుల వంటి మ్రోత లచే భూమినీ, అంతరిక్షమును నినదిం చుచూ, భయంకరమైన సింహనాదము చేసెను. అతి క్రూరములై, సహింపరానివై పిడుగుల వంటి అతని బాణముల వలన శత్రురాజుల బలములోని అశ్వములు తెగిపోయెను. గజములు ప్రాణాలు విడి చెను. రధముల గుంపులు పిండి పిండి అయ్యెను. మహావీరభటుల కవచముల తెగిపోయెను. ఛత్రములు, చామరములు

విరిగి పడెను విరులు నాలుగుదిక్కులకూ పారిపోయిరి అనంతరము ఆ చక్రవర్తులు భయపడి, విష్ణువర్ధనుని పాదములు పట్టు కొని, అతి విలువ గల ముత్యములనూ, పలు రకములైన మణులనూ కాన్కలుగా ఇచ్చిపూజించిరి.

26 -31 అ. 30 -పుట 315

అనంతరము ఆ రాజులతో కూడ జయశీలుడగు విష్ణువర్ధనుడు , పడమర దిక్కును జయించుటకు పోయెను. ఆ పడమటి దిక్కున గల కాంభోజ. పారశీక, బర్బరదేశ రాజులతోనూ, నిషాదులతోనూ, పుళిందులతోనూ, శౌర్యవంతులైన మ్రేచ్ఛు లతోనూ యుద్ధము చేసెను. వజ్రముల తోనూ, యమునికాలదండముతోనూ సమానములై వాడి గల ఆ విష్ణువర్ధనుని బాణములు తమ గుఱ్ఱములనూ, భటుల యొక్క సమూహమునూ ఛేదించెను. కవచములనూ, కిరీటములనూ తునకలు చేసెను. అది చూచి, భయపడిన ఆ పశ్చిమ దిశన గల రాజులు విష్ణువర్ధనుని కాళ్ళపై పడి, "తమ శిరస్సులను ఖండించవద్దు రక్షించుడు" అని వేడుకొనిరి. విష్ణువర్ధ నుడు ఆ పశ్చిమ దేశపు రాజులనందరనూ, దయాదృష్టితో చూచి, వారు ఇచ్చిన ఏనుగులనూ, గుఱ్ఱములనూ, మణులనూ, బంగారూ , మొదలగు వస్తువులనూ కప్పముగా తీసికొనెను.

31 1/2 - 35 అ. 30 - పుట 315

పిమ్మట, ఆ విష్ణువర్ధనుడు ఉత్తర దిక్కునకు దండును తరలించి, కురు, పాంచాల, కోసల దేశాల రాజులను, వారికి బలముగా వచ్చిన ఇతర రాజులనూ అగస్త్యమహర్షి సముద్రమును మ్రింగి నట్లు. క్షణకాలములో జయించెను

35 1/2 - 36 1/2 అ. 30 పుట 315

ఓడిపోయిన రాజులు ఇచ్చిన రత్నములనూ బంగారు మొదలగు కట్నాలనూ తీసికొని విష్ణువర్ధనుడు తన పట్టణమునకు వస్తూ మార్గమధ్యమున గల 'పెనుగొండ' అను పట్టణమును చూచెను. ఆ పట్టణములోని ప్రాకారాలూ, ద్వారాలూ బంగారుతో చేయబడినవి ఆ పట్టణమందలి మేడలు రత్నములతో కూడినవి వాటిపై ధ్వజములు ఎగురు చున్నవి మణిమయములైన తోరణ ములు. వజ్రమయములైన పురద్వార ములు కలది ఆ పట్టణము చుట్టూ గల అగడ్త పాతాళములోతులోఉన్నది ఆ ప్రాకా రాలశిఖరములు ఆకాశమును అంటు చున్నవి ఆ పట్టణకోటబురుజులు స్ఫటిక మయములైనవి అరటి, మామిడి, సుర పొన్న, నారింజ, బొట్టుగులతోను, మద్దీ, పొగడ, రాగి, శ్రీ గంధము మొదలగు చెట్లతోనూ పలురకములైన తీగెలతోనూ, ఆ పట్టణము అలరారుచున్నది ఎప్పుడూ పుష్పిస్తూ, ఫలిస్తూ, ఉండే నందనవనముతో సమానమై ప్రకాశించే ఉద్యానవనాలు, మహాత్ములైన వైశ్య శ్రేష్ఠులకు గానూ, విశ్వకర్మ నిర్మించిన నివాసములు గల ఆ పెనుగొండ పట్టణము భూలోకమునకు భూషణము ఆ పట్టణ సౌందర్యాన్ని తిల కించిన విష్ణువర్ధనుడు అమిత ఆనం దముతో పొంగి స్తుతిస్తూ తన పట్టణము నకు ఆ మార్గముననే బయలు దేరెను.

37 - 43 1/2 అ.30 పుట 317

(ఇంకావుంది)

# స్త్రీలు - రచయిత్రులు

సాముద్రిక వాస్తు విద్యా ప్రవీణ **శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ** ప్రొద్దుటూరు

తెలుగు కావ్యం 11శతాబ్దంలో పురుడు పోసికొన్నది. అంతకు ముందు తెలుగు పద్యాలు ప్రచారంలో ఉన్నట్లు శాసనాల వల్ల తెలుస్తుంది. పద్యం ఉన్నదంటే పాట కూడ తప్పకుండ ఉండి ఉంటుంది. సంగీతలయబద్ధంగా నడిచేది పాట. ఛందోలయబద్ధంగా నడిచేది పద్యం. పద్యము, పాట యీ రెండు రకాల రచనలు చేసేవారు కవులు.

సంగీతం స్త్రీలు పాడితే రమ్యంగా ఉంటుంది. సంస్కృతం పురుషులు పలికితే రమ్యంగా ఉంటుందని చెపుతారు. దీన్ని బట్టి చూస్తే, స్త్రీలు పాటలు వ్రాస్తారని, పురుషులు పద్యాలు వ్రాస్తారని చెప్ప వలసి వస్తుంది.

పూర్వకాలం స్త్రీలు పాఠశాలలకు వెళ్ళి చదువుకొనడమనేది మృగ్యంగా వుండేది. స్త్రీలకు విద్యాభ్యాసం చేసే అవకాశం ఉండేదికాదు. ఆ మాటకు వస్తే, కాయ కష్టం చేసుకొనే పురుషులకు గూడ విద్యా భ్యాసంచేసే అవకాశం ఉండేది కాదు. ఇటువంటి నిరక్షరాస్యులయిన స్త్రీ, పురుషులకు రచ్చబండలే పాఠశాలలు. రచ్చబండ మీద రామాయణమో భారతమో పురాణప్రవ చనం జరుగుతూ వుంటుంది. వీరు వింటూ ఉంటారు. వినికితో మంచి పరిజ్ఞానం కలిగేది. దీన్ని శ్రుతపాండిత్య మంటారు. వీరికి భారత రామాయణాది పురాణ కథలు, సందర్భాలు కరతలా మలకాలు. వీరు గంటం తీసుకొని తాటాకు మీద కవిత్వం వ్రాయలేకపోయినా, కంఠం విప్పి ఆశువుగా పాటలు రచించువారు. స్వయంగా పాడి శ్రోతలకు పారవశ్యం కలిగించువారు. ఈ విద్యలో నిష్ణాతులయిన వారిలో సగానికిసగం మంది స్త్రీలు ఉండే వారంటే అతిశయోక్తి కాదు.

కాలం మారింది. స్త్రీలు కూడ గ్రంథాల యాలలో కూర్చుండి వివిధ గ్రంథాలు చదువుతున్నారు. సినిమాలు చూస్తున్నారు. వార్తాపత్రికలు చదువుతున్నారు. అనేక విష యాలు అవగాహన చేసుకొంటున్నారు.

కావ్యం ఎందుకు? అంటే విశ్వ శ్రేయస్సు కోసం అనేది మన ఋషుల సమాధానం: ధర్మార్థకామమోక్షాలు అనవి నాలుగు పురుషార్థాలు. ఈ నాలుగింటిని పండించుకొనడానికే మానవుడు ప్రయత్నం చేయవలెను. ఈ కృషికి కవులు ప్రాణం పోస్తారు.

సత్యం వద - సత్యము పలుకుము. ధర్మంచర - ధర్మమును ఆచరింపుము.

ఇది వేదశాసనం. కవులకలం ఈ సూత్రం ఆధారంగా నడుస్తుంది. సత్యానికి, ధర్మానికి హాని కలుగకుండ చూడడమే కవి కర్తవ్యం అసత్యాన్ని, అధర్మాన్ని ఖండిస్తూ రచన చేస్తాడు. ఇక్కడ కవి అనే మాట స్త్రీపురుషులకు ఉభయులకూ వర్తిస్తుంది.

కవిత్రయం తరువాత, శ్రీనాధ పోతనల తరువాత, నాచనసోమన భాస్కరుల తరువాత రాయలవారి అష్టదిగ్గజకవులకు ప్రశస్తి వచ్చింది. ప్రబంధాలు రాయలసీమ రత్నాలు. రాయలవారి తరువాత నాయక రాజుల కాలం తేలికైన శృంగార కావ్యాలు వెలువరించింది. ఈ కాలంలో కవయిత్రులు కూడ పేరుకు వచ్చినారు.

నన్నయభట్టారకునికాలం నుండి శ్రీనాధునికాలంవరకు ప్రాచీన కాలమని, రాయలనాటి కాలం నుండి ఆధునిక కాలమని మన పెద్దల అభిప్రాయం.

ప్రస్తుత కాలంలో రచయిత్రులను సీమను బట్టి వర్గీకరించడం అసాధ్యం. ఎందు కంటే, స్త్రీ జన్మస్థలం వేరు, అంటే పుట్టినిల్లు ఒకటి. మెట్టినిల్లు ఒకటి. ఉద్యోగ రీత్యా అన్యభాషా ప్రాంతానికి వెళ్ళి పని చేసే వారున్నారు. లేదా, భర్తల ననుసరించి అన్యప్రదేశాలలో నివసించేవారు కూడ వున్నారు.

అమెరికాలో స్థిరపడిన వివిధ ప్రాంతాలకు చెందిన భారతదేశ మహిళలు రచయిత్రులగుచున్నారు. ప్రకృతితః వారు రచయిత్రులు కాకపోయినా, తూర్పుదేశాల నాగరికత, పడమటిదేశాల నాగరికత సంపూర్ణంగా భిన్నం కావడంతో మనసులో ఒక ఆశ్చర్యం కలిగి, ఆలోచన రేకెత్తి, తన భావతరంగాలను అక్షరరూపంలో పెట్టి, భారతీయులకు అంద జేయాలనే కూతూహలం రచయిత్రినిగా మలుస్తుంది. అవన్నీ పిచ్చి పిచ్చిగా వ్రాసే వ్రాతలని కొట్టిపారేయడానికి వీలు లేదు. రచన అనేసరికి మంచిని పోషించడం, చెడుగును దూషించడం ఉంటుంది ఉండి తీరవలెను. ఉంటేనే అది రచన అవుతుంది. రచన అంటే కవితారచన అన్నమాట.

ఆంధ్రప్రదేశం అంతా ఒకే రాష్ట్రమయినా సాగరతీరం భాషవేరుగా, రాయలసీమభాష వేరుగా, తెలంగాణాభాష వేరుగా వర్గీకరించి చెప్పినా భాషాపరంగా చూస్తే పెద్దతేడా కనిపించదు పూర్వ కాలంలో పరస్పరసంబంధాలు లేకుండా, ఎవరి మట్టుకు వారున్నపుడు, అనుషంగికంగా ఉండే రాష్ట్రాల భాషల స్పర్శ కించిత్ కించిత్ ఉండేది ఇపుడు నవలలు, సినిమాలు, విద్యార్థుల పాఠ్య గ్రంధాలు అన్నీ ఒకే తీరుగా ఒకే పలుకుబడితో ఒకే యాసతో నడుస్తున్నవి. చిన్న పెద్ద అందరు అదే మూసలో వ్యవహారం సాగిస్తున్నారు. కనుక ప్రాంతీయ భేదం గుర్తించడం కష్టం.

భాషకు, రచనకు, నిర్వహణకు అన్నిటికీ ఆనురూప్యం కలిగించే అంశం మరొకటి కద్దు. అది నవలాకథ కావచ్చు. సినిమా కథ కావచ్చు.

ఆధునిక కవుల జాబితాలోకి వచ్చే పాత కవయిత్రులు మనకు దగ్గరలో ఉండే ధన్యురాలు తరిగొండవెంకమ్మ. ఈమె శ్రీవెంకటేశ్వరమాహత్మ్యం వ్రాసినా, రాజ యోగసారం మున్నగు ద్విపద కావ్యా లతో ముక్తికి సోపానాలు నిర్మించుకొనే ప్రయ త్నమే చేసింది. రక్తికి పట్టం కట్టిన తాళ్లపాక తిమ్మక్క సుభద్రా పరిణయ గీతంతో నిత్య ముత్తయిదువుగా నిలిచింది. అన్నమా చార్యులవారి తాళ్లపాక పందిరిగుంజలు కూడ చిగిరించి, కవితాపుష్పాలు పూచినవి. రక్తికి తీసిపోని భక్తి ముక్తికి బెత్తెడు ఎడంలో ఉండే సక్తి తాళ్లపాక వారి ప్రత్యేకత.

కవయిత, రచయిత పుంలింగశబ్దాలు. కవయిత్రి, రచయిత్రి స్త్రీలింగ శబ్దాలు. పూర్వకాలంలో ఈ శబ్దాలకు, అమరము, ఆంధ్రనామకోశము, పురాణేతిహాసాలు, కావ్యప్రబంధాలు గురుముఖంగా చదువు కొని రచనలు చేసేవారని అర్థం. ఇపుడు రచయిత్రి అంటే, లోకజ్ఞత, మాటకారి తనం కలిగిన మహిళామణి అని అర్థం. వీరి వ్యవసాయక్షేత్రం నవల. కవయిత్రులు అనబడేవారున్నారు. వీరి వ్యవసాయక్షేత్రం వచనగేయాలు. పునరుక్తులు, శబ్దాలం కారాలు యథాశక్తిగా పండిస్తూ ఉంటారు. ఆకాశమార్గంలో కీలుగుఱ్ఱం మీద విహరించే ఊహలతో చమత్కారం కల్పిస్తూ పోతారు. ఉత్ప్రేక్షాలంకారాలు మెండు. కొందరు లబ్ధప్రతిష్ఠులయిన మహనీయులు వ్రాసే నవకవితలకు తల తోక ఉండవు. శంకర భగవత్పాదులు బ్రహ్మసూత్రాలకు వివరణ వ్రాసినారు. గొప్ప మేధావులు అయినా ఈ నవకవితలకు వివరణ వ్రాయలేరని చెప్పవచ్చు. మరి ఆ రచనలు ఎవరికి అర్థమవుతాయి? ఎవరికీ కావు. అయితే చలామణి అవుతున్నవి కదా? అంటే, అందరూ నాగరకులే కనుక తమకు అర్థమైనట్లే నటిస్తు ఉంటారు. ఒక కథ చెపుతారు చూడండి దేవతావస్త్రాలు అని. ఇక్కడ నూలు లేదు. వస్త్రంలేదు. ఏమీ లేక పోయినా మర్యాద కోసం అందరూ ఓహో అని అభినందిస్తూ ఉంటారు. ఈ కవితల కత అంతే. ఏమి చేస్తాము? కాల ప్రభావం.

(కడప ఆకాశవాణి, సౌజన్యంతో)

## అందరూ ఆలోచన చేయుటకు వీలుకలిగినది

ఆర్యా!

వైశ్యప్రబోధిని నవంబరు సంచికలోని సంపాదకీయం ఒకపర్యాయం తిరిగి అందరూ ఆలోచన చేయుటకు వీలు కలిగించింది. ఇదే సంచికలోని శతావ ధానులు శ్రీ సి.వి.సుబ్బన్నగారి "వైశ్యులకు సహజగుణభూషణమైన త్యాగముయొక్క వన్నె తగ్గలేదు" - అను వ్యాసం, వైశ్యుల యొక్క గొప్పతనాన్ని, వారి గుణవిశేషాలను చక్కగా వివరిస్తూ ఉంది. వారికి నా ధన్య వాదాలు. అవకాశం ఉన్నపుడల్లా ఇదే విధముగా మనవారి గొప్పతనాన్ని తెలిపే వ్యాసాలను ప్రచురిస్తూ ఉండగోరెద.

- వక్కలగడ్డసూర్యప్రకాశరావు
నర్సరావుపేట.

# భారతదేశ స్వాతంత్ర్యము కోసం పోరాడిన వైశ్యసోదరులు




సేకరణ శ్రీచుండూరిఅప్పారావు. రావెల

(గతసంచిక తరువాయి)

**విశాఖపట్నం జిల్లా**

1. పసుమర్తి వీరభద్రస్వామి, విజయనగరం.
2. విన్నకోట జగన్నాధగుప్త. యం.యల్.ఏ విశాఖపట్నం.
3. కొల్లూరు సూర్యనారాయణగుప్త, విశాఖపట్నం.
4. కోరుకొండబుచ్చిరాజు, అనకాపల్లె.
5. గుడ్లవెంకటరమణమూర్తి, లక్ష్మీనరసపేట.

**తూర్పుగోదావరి జిల్లా**

1. కొత్తమాధవరావు, పిఠాపురం.
2. అద్దేపల్లి నాగభూషణంగుప్త, సామర్లకోట

**కృష్ణా జిల్లా**

1. కూరాళ్ళభుజంగరావుగుప్త, గుడివాడ.
2. శ్రీకాకొళపు వీరరాఘవయ్య, పెడన.
3. ఉసిరికె సుబ్బరావుగుప్త, నిజాంపేట.
4. గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, గుడివాడ.

**వైశ్యశాంతి సైనికులు**

1. కొల్లా కాశీవిశ్వనాథంగారు, తెనాలి.
2. పొన్నూరుహనుమంతరావుగారు, తెనాలి.
3. కొమ్మూరు వెంకటరత్నంగారు, పెద్దపులిపర్రు.
4. మద్దుల వెంకటగిరిరావుగారు, భట్టిప్రోలు.
5. పొన్నూరు రాఘవయ్యగారు, తెనాలి.
6. తడవర్తి రాజారావుగారు, కనగాల.
7. గుంటూరు నరసింహారావుగారు, గుంటూరు.
8. పాలకుర్తినరసయ్యగారు, రేపల్లె.
9. చందలూరి సుబ్బరావుగారు, రాజోలు.
10. వేములు వెంకటప్పయ్యగారు, ఓలేరు.
11. మద్ది వెంకటరంగయ్యగారు, బ్రాహ్మణకోడూరు.
12. మాతంశెట్టిసీతారామాంజనేయులు గారు, గుంటూరు.
13. శిఖాకొల్లు పట్టాభిరాములుగుప్తగారు చీరాల.
14. గ్రంధి వెంకటసుబ్బరాయగుప్తగారు, నంబూరు.

(ఆర్యవైశ్యమహాసభవారిచే 1930సం॥లో నియమించబడినవారు)

(స్వతంత్రభారతి స్వర్ణోత్సవాల సందర్భంగా)

## గతసంచికకు ముఖ్యసవరణ

గత (నవంబరు) సంచిక 5-7- పుట ల్లోని శ్రీ దేవతశ్రీరామమూర్తిగారి జీవిత చిత్రణలో ఆనాటి పోలీసుఅధికారి 'డయ్యరు' అని ఉన్నదానిని 'ముస్తఫాలీఫా' అని మార్చుకోవాలి. అట్లే ఆ వ్యాసములో డయ్యరు అని వచ్చినచోటుల్లా కూడ ముస్తఫాలీఫా అని మార్చుకొని, ఆ వ్యాసము లోని డయ్యరుకు సంబంధించిన అన్ని వాక్యాలనూ తొలగించుకోవాలి.

- సంపాదకులు

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1 రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2 రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును దాత ఫోటో వేయబడును 3. రు 1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును 14 అంకణములు పరిమితం

రు 2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును

అన్నదానమునకు రు 100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును

అన్నదానమునకు రు 10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు 5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రికుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము 4 10 95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము

వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వర్షుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. <u>శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమకుండ చతుర్థ మహా క్రతువు</u> పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు ఒకరు దంపతుల ప్రకారం చేయబడును ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం [illegible] వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు

## <u>ఇందులకై సమర్పించవలసిన విరాళములు</u>

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు 2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని అయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973

## ▣ విజ్ఞప్తి ▣

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉగహరించిన ప్రకారము తీర్మానించారు

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వబడును ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను మరొకరికి వ్రాసి పంపకూడదు ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును మైనరు దాతలు అంగీకరింపబడరు ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి డి లు వారికి వాపసు పంపబడును పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను

డి డి లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను వారికి బదులు యితరులు చేసిన చెల్లదు విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు

ఇట్లు
దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

**ఆర్.ఆర్.నాధం**
మేనేజింగ్ ట్రస్టీ

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8 2 1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5 11 1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది

ఈ అన్నదాన సంఘానికి

రూ 10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ 5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ 2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు

రూ 1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు

రూ 10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును

రూ 5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.12.97 నుండి 20.1.98 వరకు)

దుకాణాలు - సంస్థల చట్టము క్రింద రిజిష్టరు కాబడిన తమ వ్యాపార సంస్థ యొక్క రిజిస్ట్రేషనును పునరుద్ధరణ చేసికొనుటకుగాను తమ దరఖాస్తును A-A ఫారములో పంపనివారు సదరు A-A ఫారాన్ని ఈ (డిసెంబరు) నెల 30వ తారీఖు లోగా "ఫైను"తో పంపాలి

చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి వచ్చే (జనవరి) నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి చెక్కుద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును జనవరి నెల 20వ తారీఖున గానీ, అంతకుముందుగా గానీ అందుకు సంబందించిన అమ్మకంపన్ను శాఖాదికారికి చేరునట్లుగా పంపాలి

పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1997 నవంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ డిసెంబరు 1వ తేదీలోగా చేర్చాలి

1997 నవంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వనెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి ఆ డిసెంబరు 30వ తేదీలోగా చేర్చాలి

